శ్రీ

# హరిశతకము.

ఇది

శ్రీ రామభక్తాగ్రేసరుండగు

తూము నృసింహదాసుగారి పౌత్రుండును,

ప్రస్తుతము పెద్దాపురము తాలూకా

హెడ్ అక్కౌంటెంటుగా నున్నట్టియు

## తూము సీతారామయ్యచే

భగవద్భక్తిపరాయణుల కత్యంతోపయోగం

బగునటుల రచింపఁబడియె.




రాజమండ్రి

యస్ గున్నేశ్వరరావు బ్రదర్సువారి

శ్రీ చింతామణీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1924.



శ్రీ

# హ రి శ త క ము.



శా. శ్రీవత్సాంచిత కౌస్తుభాభరణ లా ♦ శ్రీమత్కిరీటోరస్థలా
భావాతీత మహాప్రభావయుత కం ♦ దచ్ఛంఖచక్రోజ్జ్వలా
జీవత్రాణకృపామృతప్రవిమలా ♦ విహారిత నిర్వ్యాకులా
దేవవ్రాతసమాశ్రితాంఘ్రియుగళా ♦ నిర్మలా! శ్రీహరీ.

ఉ. శ్రీరమణీయలోకచయ ♦ సృష్టివినాశనకారి! పాపసం
హార! చరాచరావనకృ ♦ పామృతసార! పరోపకార! హృ
ద్ఘోరవికారషడ్గుణవి ♦ దూర! వివర్జితపాపసజ్జనా
ధార! జగద్విహార! విభ ♦ తప్రియదానుసార! శ్రీహరీ. 2

చ. పరిహృతపాపజాల! భవ ♦ బంధపత్త్రియశీల! ధర్మసం
సంకలమానవప్రకర ♦ పాల! జగత్ప్రతిపాల! మోక్షభా
సురవిభవాలవాల! పరి ♦ శుద్ధమతిప్రవిశాల! భక్తహృ
త్సరసిజవాసలోల! సను ♦ తక్రపఁజూడ వదేల! శ్రీహరీ. 3

మ. జగదాధార! జగత్సమూహరచనా ♦ సంరక్షశిక్షక్షమా!
జగదాకార! జగద్విహార! జగదీ ♦ శా! సజ్జగత్పావనా!
జగదాత్మా! జగదేకపూజిత! జగ ♦ జ్జాలప్రపూర్ణోదరా!
జగదస్వస్థహరా! జగన్నుత! జగ ♦ త్సాక్షీ! నమ 4

మ. పరమానందవివేకసత్యమయరూ ♦ పా! నిర్వికారప్రభూ!
పరజీవప్రాపకృతీ! యనాదనిధనా! ♦ భవ్యాంతరంగా! చరా
చరసంరక్షక! కోటిసూర్యసమతే ♦ జా! జన్మమృత్యుక్షయా!
నిరపాయా! నిగమాంతవేద్య! కలుషా ♦ నీకోత్తరా! శ్రీహరీ. 5

ఉ. వరదా! చిన్మయ! నిర్మలా! నిరు ♦ పమా! వాత్సల్యపాథోనిధీ!
నిరయోత్తార! నిర్వికల్ప! సుగుణా ♦ నీకాశ్రియా! నిర్భయా!
పరమార్తప్రజదుఃఖనాశన! జగ ♦ ద్వ్రాతావనా! పావనా!
పరమాత్మా! తరమా నినుస్ధగను ♦ తింపన్నాకు శౌరీ! హరీ. 6

ఉ. ఆరయ లేదు శాస్త్రవిష ♦ యంబులఁ బండితసేవఁ జేసి వి
ద్యారస మాన లేదు, భవ ♦ దద్భుతచర్యలఁ బ్రస్తుతింపఁగా
నేరుపు లేకయుండియును ♦ నీపదభక్తి స్ఫురించి యెట్టులో
నే రచియింపుచున్న కృతి ♦ నిం గ్రహియింపఁగదే కృపన్ హరీ.

మ. భవబద్ధాత్ముఁడనైన, విమూఢమతినై ♦ ప్రారబ్ధదుష్కల్మషా
ర్ణవనిర్మగ్నుఁడనైన నే నతిపవి ♦ త్రప్రస్ఫురచ్ఛాంతి హా
ర్ద వివేకోజ్జ్వలు నిన్నుఁ బ్రస్తుతులచే ♦ సంతుష్టుఁ గావింపఁబూ
ను విరుద్ధంబగు సాహసంబు గుణాసిం ♦ ధూ! సైపవే శ్రీహరీ. 8

ఉ. ఎవ్వఁడు విశ్వజాలము ల ♦ యించినవెన్కను గూడ సత్ప్రభ
న్నివ్వటిలున్, దిక్కాలములు ♦ నేరవు జన్మలయంబు లెన్నఁగా
నెవ్వనిఁ గూర్చి, భూతచయ ♦ మెల్ల పునర్భవమొంద బీజమై
యెవ్వఁడు వెల్గునట్టి పర ♦ మేశుఁడ వీవకదయ్య శ్రీహరీ. 9

శా. నింగి న్వాయువు, వాయువం దనల ♦ మగ్ని న్నీరు, నీట న్ధరా
రంగం, బాధర సర్వజీవచయ, మీ ♦ ప్రాప్తిన్ జగజ్జాలము
ప్పొంగన్ జేసితి వొక్కటిన్ మహాకౌతుకన్ ♦ బుట్టించి యీసృష్టిఁ జూ
డంగా నీమహిమ్నం బచింత్యమని రూ ♦ ఢంబౌఁ జుమీ శ్రీహరీ.

ఉ. ఒక్కయజాండ మొక్కయినఁ ♦ దున్న తెఱంగ నెఱుంగలేము నీ
విక్కమలాసనాండముల ♦ నీ యిమలన్ బహుకోట్లసంఖ్యల
న్నిక్కముగా సృజించితట ♦ నీమహిమాద్భుతసృష్టిఁ దెల్పఁగా
వాక్కులు లేవు, నీకివె న ♦ భక్తిసమగ్రనమస్కృతుల్ హరీ.

చ. ఇను నొకనిన్ గనుల్దెరచి ♦ యేర్పడఁజూడఁగలేని మర్త్యులా
యినమహితోజ్జ్వలాండము ల ♦ నేకము లక్షులుగా వెలుంగు నీ
యనుపమసృష్టిరక్షణల ♦ యుక్రమదక్షసమానకోటి స
ద్దినకరతేజమున్ గనులఁ ♦ దేరి కనన్గలవారె శ్రీహరీ 18

శా. దావాగ్నిచ్ఛటనుండి వెల్వడెడు ♦ నుద్యద్విస్ఫులింగంబుల
ట్లావిర్భావము నొందు నీమొదల శ్రీ ♦ వానీకముల్ తన్నతలాం
భోవాతాగ్ని నభోగణంబులును త ♦ న్మూలంబుగా సర్వమున్
దేవా! పావకగర్భగోళము జగ ♦ న్నిక్షేపమో శ్రీహరీ. 19

మ. గిరిజాలమ్ముల్, ధరణీరుహాంబులు శిరః ♦ కేశాళి, పక్ష్మాకరో[యు
త్కరముల్ నాళ్ళు, నదుల్ నరంబులు, సము♦ద్రం బుజ్జ్వలత్కుక్షి,
ర్వరబాహ్వంఘ్రి ముఖాఖిలాంగకము, శ్రీ ♦ భంగిన్ ధరామండలిన్
బరికింపన్ భవదుజ్జ్వలాకృతిగఁ జూ ♦ పట్టున్ జుమీ శ్రీహరీ. 20

మ. ధరణీజంబునఁ బత్త్రపుష్పఫలసం ♦ తానంబు కాలోచిత
స్ఫురణన్ బుట్టి నశించుఁజెట్టు సెడదా ♦ చొప్పొప్ప నేతచ్చరా
చరయుక్తాఖిలసృష్టి పుట్టుచు వినా ♦ శంబొందు నుండున్ భవ
ద్వరదివ్యాంగమునందు నీవెపుడు ని ♦ త్యస్థాయివౌ శ్రీహరీ. 21

మ. ఘనలోకావళియందు నెల్లెడల నా ♦ నాకాశంబు వర్తిల్లుచు
న్నను, గాఢన్యము లైనవస్తునిచయాం ♦ తస్సీమలం దుండదే
వనఘా! యెట్టియచింత్యమూర్తివొకొ వ ♦ స్త్వంతర్గతిన్ గూడనుం
దు నృసింహోద్భవమామహామహిమ ను♦ద్ఘోషింపదే శ్రీహరీ. 22

చ. జగముల సృష్టికై యజుని, ♦ శంకరుఁ దద్విలయం బొనర్పఁగా
నగణితజీవకోటుల మ ♦ హాద్భుతమోహతమంబునందుఁ గూ
ల్పఁగఁ బ్రకృతిన్ రచించి సక ♦ లంబున కీవాకరుండ వయ్యు సా
క్షిగతి నటింతు వెప్పుడు వి ♦ చిత్రిముల న్గనుగొంచు శ్రీహరీ. 29

మ. ధర వర్ధిల్లు సమస్తజీవులకు నా ♦ ధారైకనాథుండవై
పగకన్ రక్షణ శిక్షలన్ సలుపు నిన్ ♦ భావించి యోభక్తుఁడే
వరరూపాఖ్యలఁ బ్రీతిఁగొల్చినను ♦ తద్భక్తస్థటాక్షింతు వా
వరరూపాఖ్యలవాని హృత్కమలసం ♦ వాసుండవై శ్రీహరీ. 30

మ. మనమం దూహదనించుమాత్రమున ♦ సంప్రాప్తింపు నే కార్యమై
నను, నీ కెందును లేవసాధ్యములజాం ♦ డశ్రేణిఁ దార్ల్యాటుగా
నొనరింపంగల శక్తిశీకగుఁడవ ♦ య్యున్ నిత్యపాంభోధి పో
టును గాదే సకలార్థముల్ కలుగుచుం ♦ టే నాకిలన్ శ్రీహరీ.

ఉ. పెక్కులు కష్టముల్ ప్రజలు ♦ పెక్కనుచుంగఁ గొంద్రు భూధవుల్
దక్కఁ దొకష్టమైనఁ దగు ♦ ధర్మముఁ బాలన సేతు మంచు, నీ
వెక్కుడు ప్రేమ లోకముల ♦ నేలెద వూరక సర్వమిచ్చి, న
న్నెక్కడ దేవలోక మది ♦ యెక్కడ రెంటికి నీడు శ్రీహరీ. 32

చ. సకలమహాస్థలంబులను ♦ సమ్మతిఁ జూచినయట్టి పుణ్యముల్
వికలముగాని చిత్తమున ♦ వేల్పులనందఱిఁ గొల్చు సత్ఫలం
బకలుషితాంబువాహినుల ♦ నర్థిని స్నానమొనర్చు సత్ఫలం
బొకత్రుటిని స్మరింప వెల ♦ యున్నది పావననామ శ్రీహరీ. 33

మ. ప్రకృతి న్గూడి నిజాంశల న్బరసి జీ ♦ వవ్రాతసంజ్ఞన్ జగ
త్ప్రకరంబై విలసిల్లె దీవనుచు న ♦ ద్వైతంబును న్నీవు జీ
వికలీతుండ వటంచు ద్వైతము ని ♦ ట్లుల్ వేలీలల న్నీయ గా
ధకళావ్యాప్తివిఁబల్కెడున్ బహుమతాం ♦ తర్భేదముల్ శ్రీహరీ

మ. తను సంసృష్టినిఁ గన్న, నింద్రియమనో • ద్యచ్ఛక్తుల న్గన్న, నీ
ఘన తేజం బగు నాత్మఁ గన్న, నరిష • ట్కవ్రాతము న్గన్న, గ
ర్మనిబంధంబులఁ గన్న, జన్మ లయని • ర్మాణంబుల న్గన్న నే
మనుజుం డైనను నీమహామహిమ స • న్మానింపఁడే శ్రీహరీ. 35

మ. భవదుద్యన్మహిమం బచింత్యము మనః • ప్రాణేంద్రియశ్రేణి క
గ్గవ కింతైనను గానరాక తను సాం • గత్యంబున న్గొండఁ బిం
డివిధి న్మోక్ష మహాక్రియల్ సలుపు నీ • దేవ స్మహాశక్తులన్
భువియందు న్వెదసల్లినాడపు కృపాం • భోరాశివై శ్రీహరీ. 36

శా. కన్నుల్, ముక్కు, చెవుల్, శిరంబు, కరముల్ • కంఠంబు బాహ్వంఘ్రులి
ట్లున్నన్ నేరిచి మేనుఁ జేసి యుచటన్ • హృత్పద్మమున వేంద్రియా
ళిన్నిర్మించి, పురాకృతం బెఱుఁగు తె • ల్వి న్మాయచేఁ గప్పి దే
హాన్నెవ్వారికిఁ గ్రిమ్మచుందుగని క • ల్యైకస్థితిన్ శ్రీహరీ. 37

మ. తను వే రాజ్యము, నీవు భూమిభుఁడ వే • త్పద్దీనమే మంత్రి, నై
వ్యవికారాయంబు దశేంద్రియంబులు, మనో • హంకారబుద్ధ్యావళుల్
ఘన సేనాధిపు లింక దిగ్విషయముల్ • త్వత్సన్నిధిన్ మంత్రిప
ద్యుపద న్విన్నప మొప్పఁ జేసెదరు నై • న్యోద్యోగులై శ్రీహరీ.

మ. త్రివిధం బైన భవన్మహాప్రకృతిచే • సృష్టిన్ సమస్తం బొనర్
ప్ప వినోదంబుగ వృద్ధిసేతువు తుదిని • ర్మూలింతువు నాశ న్మలం
దవలంబంబును మాని యొక్కరివి నే • కాకారివై వెల్గుచుం
దు పమోఘాతినిరంకుశాప్రతిహతో • ద్యోగంబునన్ శ్రీహరీ. 39

మ. బాలుం డాటకు బొమ్మరిండ్లఁ గడునో • ప్పన్ జేసి యవ్వానిలో
నాలంబుల్ మగడంచుఁ దక్కినపనం • బం చేసియో పెట్టి వే
డ్కలల్లా నడిపించి పోఁజెరుచు పో • ల్కిన్ లోకముల్ తద్గతా
త్మాళిన్ జేసి హరించుచుందువు క్రీ • డార్థంబుగా శ్రీహరీ. 40

శా. కించిజ్జ్ఞత్వముతోఁ, గుణత్రితయసం ♦ కీర్ణస్వభావంబుతోఁ
ప్రెంచనాత్రిని సతీసుతాలయధన ♦ ప్రేమానుబంధాళితోఁ
జాంచల్యస్థితి నుండు జీవి కెటులన్ ♦ శక్యంబె నిన్నిర్గుణున్
దంచస్ఫూర్తి, నచింత్యశక్తిని, విరు ♦ ద్ధవ్యక్తినిన్ శ్రీహరీ. 47

శా. నిన్నున్ గానకయుండియున్ బుధవ ♦ రుల్ నీనామమున్ జిహ్వతో
డన్నిష్టన్నుతియించి దుష్కలుషసం ♦ ఘధ్వంసులై భూరిసా
ఖ్యోన్నత్యస్థితి బొందుచుందురట దే ♦ వా! నీశుభాకారమున్
గన్నారన్గనఁగూడినన్ గొఱఁత లు ♦ న్నా జీవికిన్ శ్రీహరీ. 48

మ. నిరహంకారము నిర్వికారమనము ♦ న్నిర్మోహమున్ సత్యవా
క్షరతత్వంబును సర్వభూతదయయున్ ♦ మిత్రత్వమున్ శాంతమున్
నిరతానందము నిర్భయత్వము, భవ ♦ స్మీరంధ్రిసధ్యానమున్
దిరమైయొప్పెడువానిఁ గూడెదవు కా ♦ దే భృత్యు డట్టుల్ హరీ. 49

ఉ. భూతహితానురక్తి, సమ ♦ బుద్ధి జితేంద్రియవృత్తి కల్గి సం
ప్రీతి నినున్ భజించెడు వి ♦ వేకియె నీ కనువైన భక్తుఁ డీ
వాతని కుగ్రకష్టవిచయం ♦ బుఁ గొల్పియు మోహదుర్లతా
వ్రాతముఁ ద్రెంపి వేగ భవ ♦ వార్ధిఁ దరింపఁగఁజేతు శ్రీహరీ 50

మ. మతి నిందాస్తుతులున్ హితాహితములున్ ♦ మానావమానంబు లు
న్నతనీచస్థితులున్ శుభాశుభములున్ ♦ శత్రుత్వమిత్రత్వసం
గతులున్, గష్టసుఖంబులున్ సమముగాఁ ♦ గైకొంచు నిన్గొల్చు ను
న్నతయోగంబున కీడె యొట్టితప ♦ మైనన్గా ధాత్రిన్ హరీ. 51

ఉ. భూతచయంబు నీయెడ ♦ భూతచయంబులని న్విపర్యయా
తీతముగాఁ గనుంగొను సు ♦ ధీవిలసన్మణు లుచ్చనీచసం
జాతవిభేదముల్ విడచి ♦ సర్వశరీరులయందుఁ దుల్యపూ
ప్రీతిఁ జరింతు రట్టి సమ ♦ విశ్రుతభావ మొసంగవే హరీ. 52

మ. తనయందున్ బలె సర్వభూతములపై ◆ దాక్షిణ్యభావంబునన్
మనునాతం డఖిలాగమానుగత ధ ◆ ర్మానుష్టసంశీలున
ట్లనపాయోజ్జ్వలమోక్ష మొందఁ బరజీ ◆ వార్థానుకూలప్రవ
ర్తనకంబౌ న్నినుఁ బ్రీతుఁ జేయఁగలకా ◆ ర్యం బున్న దే శ్రీహరీ.

శా. కాంతిం బెట్టు లసూదులప్డరికి నా ◆ కర్షించు నాలీల న
శ్రాంతంబున్ భవదంఘ్రిచింతనసుధా ◆ సారంబు సద్భక్తినా
స్వాంతాబ్జాళిఁ గ్రహించునందునఁ గదా ◆ జ్ఞానుల్ భవద్భక్తిచేఁ
గాంతాపుత్రధనాళి నైన విడుపం ◆ గా నోడరో శ్రీహరీ 54

చ. మలినపుగుణ్డయందుఁ గల ◆ మానికమట్టుల మోహలోభసం
కలితహృదంతరాళములఁ గల్గి ◆ యుఁ గానఁగరావు, జ్ఞానని
ష్ఠలహృదయాంబుజంబులను ◆ శోభిలుచుందువు నిల్వుట
ద్దమండలి ప్రతిబింబమట్లు కరు ◆ ణారసపూర్ణ మహాబ్ధి శ్రీహరీ 55

చ. అమలిన భక్తిసౌరభజ ◆ లార్ఘ్యము, హర్షరసాశ్రుపాద్యమున్
గ్రమమున నిచ్చి చిత్తమృదు ◆ కంజసుఖాసనమందుఁ జేర్చి. హృ
త్సుమమునఁ బూజ సల్పి పరి ◆ తుష్టినిఁ గర్మఫలాళి నీకు స
ర్వముఁ దగ ధారవోయఁగల ◆ వాఁడు కదా యనఘుండు శ్రీహరీ.

చ. కనులకుఁ గానరాకయె య ◆ ఖండచరాచరజీవరాసులన్
ఘనతరకర్మపాశములఁ గట్టి ◆ యథేచ్ఛను ద్రిప్పఁగల్గియున్
దనువులఁ దాల్చి గూఢగతి ◆ ధాత్రి జరింతు వ కానోకష్ఠు స
జ్జనులకు దర్శనోత్సవ మొసం ◆ గుచుఁ గ్రీడ యొనర్ప శ్రీహరీ. 57

మ. ఘనసంసారభవజ్జగన్మయునిరా ◆ కారంబు నూహింపనే
ర నఖండోగ్రభవన్మహాజగదపా ◆ రవ్యాప్తదుర్లోక్యమా
తను వాత్మ న్గన నేర, భక్తజనహృ ◆ త్పద్మార్కసర్వార్థసా
ధనమాఁ దావకవైష్ణవాకృతి మ ◆ దాత్మ న్నిల్పవే శ్రీహరీ. 58

చ. మించిన భూతసృష్టి విర ♦ మించి విరించి ప్రశాంతి గాంచి ని
ద్రించినవేళ నంబుధి ధ ♦ రిత్రిని ముంపఁగ మీఁన మామ నే
తెంచి సురారి సోమకు వ ♦ ధించి తగన్నిగమావళిన్ గటా
క్షించి వినష్టసృష్టిఁ గలి ♦ గించితి కర్మిష్ఠుఁడఁ గూర్మి శ్రీహరీ. 59

చ. పరమకృపాబ్ధివై సుజన ♦ వారముఁ బ్రోచెద వెట్టి దుష్టఘా
చరణ మొనర్చియైన, దివి ♦ జప్రకరంబుల ముఖ్యు లెట్టకై
శరధిని గచ్ఛపంబ వయి ♦ శైలముఁ దెచ్చి మథించి దైత్యసం
హారణ మొనర్చి కూర్చితిక ♦ దా యమృతం బమరాళికిన్ హరీ. 60

మ. వసుధ న్మున్ను ధరిత్రి విప్రులకు ని ♦ ల్పనారిమిఁ బద్మోద్భవుం
డనువు న్గానక నిన్ను వేఁడఁ గిటి భూ ♦ దార్యాకారివై వచ్చి య
బ్ధి నిమగ్నావని నుద్ధరించి జగదా ♦ భీలాక్షు హేమాక్షుఁ గూ
ల్చిన సిద్ధార్థహితానురక్తి మదిలోఁ ♦ గాంచెదన్ శ్రీహరీ. 61

మ. అనయము వెల్గనీ వణువు ♦ హాత్ప్రకృతుల్ సదమ భక్తులన్
గనులకు తెప్పలట్లు కృపఁ ♦ గాచెద నంచనఁ గంబమందు సం
జననమునొంది తద్భుతల ♦ సద్విభ నుగ్రనృసింహమూర్తివై
దనుజనుతో భక్తి భక్తపర ♦ తంత్రపరాత్పరమూర్తి శ్రీహరీ. 62

మ. అనలోగ్రిచ్ఛట కాల్పదయ్యె, ఘనఖ ♦ డ్గాద్యాయుధ శ్రేణి త్రుం
పనివయ్యెన్, విష మెక్కదయ్యె, జలధుల్ ♦ పారీణావలోకంబు స
ల్పనివయ్యెన్, మఱి యింక నేదియు వధిం ♦ పజాలదయ్యెన్ గదా
ఘనుఁ బ్రహ్లాదుని మున్ను దావకకటా ♦ క్షపాప్తిచే శ్రీహరీ. 63

ఉ. ఎందున దేనిచేత మఱి ♦ యేవివిధాయుధసాధనంబులన్
ద్రుందకయుండ సద్వరము ♦ బ్రహ్మకడన్ గొని లోక మాపదల్
పొందఁ గలంచు హేమకశి ♦ పున్ దృఢి వాల్చితి వద్భుతక్రియా
సింధువవైననీయెదుటఁ ♦ జెల్లునె పౌరుషదర్పముల్ హరీ. 64

మ. అతిచిత్రంబులొనర్చు భక్తజనర • క్షార్థంబుగన్ దైత్యని
ర్జితదేవాళి స్వర్గరాజ్యపదులన్ • జేయన్ బలిన్వామనా
కృతినర్థించి త్రిపాదమాత్రము ధరి • త్రీదానమున్ బొంది య
ద్భుతవిశ్వాకృతి నాక్రమించితి జగం • బుల్ మూటినిన్ శ్రీహరీ.

మ. భవనాశాఖ్యుఁడవయ్యు ధర్మగతిలో • పంబాతిజన్ ధాత్రిసం
భవమైనాపెను భూధరంబు భృగుసద్వంశంబునన్ బుట్టి భూ
ధవదుర్గర్వమహాంధకారఘనమా • ర్తాండుండవై జామద
గ్న్యవనన్ ఘోరకుఠారరాముఁడవనన్ • బేర్గొందితుర్విన్ హరీ. 66.

మ. రవివంశంబునఁబుట్టి, శంకరుధను • ర్భంగంబుఁగావించి, సీ
తవివాహంబయి తండ్రియాజ్ఞనువనాం • తర్భ్యామికిన్ బోయి, దై
త్యవరుం డగ్రతపత్నిఁగొంచుఁజనఁ గీ • శానీకమున్ గూడి య
ర్ణవమున్ గట్టి దశాస్యుఁగూల్చితివి ని • ర్వంశంబుగా శ్రీహరీ 67.

మ. పురుషానీకములో రఘుప్రవరునిన్ • బూఁబోఁడ్లలో జానకిన్
సరిపోలంగలవారలుండురె దగ • త్సంసృష్టియం దెందునన్
బరగన్ స్త్రీపురుషప్రవర్తన విధి • ప్రామాణ్యముల్ దెల్ప ని
ద్ధరణిన్ లక్ష్మియు నీవుపుట్టితిరి సీ • తారాములై శ్రీహరీ. 68.

మ. వడఁకెన్నిర్జరభీతి సేతువుతఱిన్ • వారాశినీప్రజ్వల
ద్బడబాగ్నిప్రదరాహతిన్ బ్రళయదు • ర్వారాగమంబొక్కొ యం
చడలెన్ లోకము ద్రోణశైలమునుఁ జం • డాంశోదయభ్రాంతిచేఁ
బడఁగూల్పన్ శరమీవు తాల్ప రఘురా • డ్వ్యాఖ్యాకృతిన్ శ్రీహరీ.

మ. పరమద్రోహినిఁగాకుఁబ్రోచితివి శుం • భద్వైరిదైత్యాత్మజన్
శరణంబిచ్చి యనుగ్రహించితివి పా • షాణంబునన్ దివ్యమా
దరిఁగావించితి, కూర్మితోడనుడతన్ • లాలించితాలించి తా

శా. ఝాలన్దేల్చితివీటఁ గ్రోతిగమిచే ♦ రక్షోబలంబుల్ విని
ర్మూలింపంగనొనర్చి తుగ్రమహితాం ♦ భోరాశికిన్ సేతువున్
లీలన్గట్టితి వద్భుతంబుగ మృతుల్ ♦ జీవింపగావించితో
త్రైలోక్యావన! రామతారకపరబ్రి ♦ హ్మాంబ వీవే హరీ. 71.

ఉ. ఇచ్చితివ య్యహల్యకుఁగల ♦ యెల్లదనాళికి మోక్షవైభవా
త్యుచ్చపదంబుఁ గర్మజని ♦ తోగ్రనిబంధముల్ హరించి నీ
మెచ్చినకోతికైననజు ♦ మేలుపదం బొనఁగూర్తు మర్త్యులన్
హెచ్చుసుఖంబులిచ్చి కరు ♦ ణించుట నీకదియెంత శ్రీహరీ. 72

శా. శ్రీరామాకృతి నీవొనర్చిన పనుల్ ♦ చేతోగతిన్ జూచి దు
ర్వారాఘంబుల నైన నెంచక కృపా ♦ వారాశి వై నీదరిన్
జేరన్వచ్చెడు దీనకోటికి గతుల్ ♦ నేకూర్తు విం దంతటం
జారన్నమ్మి జనుల్ భజించెదరు రా ♦ మాఖ్యన్నినున్ శ్రీహరీ.

శా. రాముం డంచు, వికారదూరవిబుధ ♦ వ్రాతాంతరంగజ్వల
ద్ధాముం డంచు, దశాస్యముఖ్యఖల ♦ దైత్యధ్వాంతదీప్యత్ప్రభా
ధాముం డంచుఁ, ద్రిలోకపావనకరో ♦ ద్యన్నాముఁ డంచున్, బరం
ధాముం డంచు నిను న్నుతించెదరు స ♦ ద్భక్తుల్ సదా శ్రీహరీ.

మ. యదువంశంబునఁ బుట్టి, నందునిగృ ♦ హంబం దద్భుతక్రీడ లిం
పొదవన్ బాల్యమునందె సేసి కలుషో ♦ ద్యోగప్రశంసన్ విప
త్ప్రదుఁ గంసున్ బడఁగూల్చి భారతరణ ♦ వ్యాపారి వై దుష్టరా
డ్వధఁ గావించిన వాసుదేవుఁడవు కా ♦ వా శ్రీనివాసా హరీ. 75

మ. బాలక్రీడ వధించి తెందఱనొ శుం ♦ భద్దైత్యసంఘంబులన్
జ్వాలాభీలదవాగ్ని మ్రింగితివి దు ♦ ర్భారాచలం బొక్క చే
లీల న్దాల్చితి, కాళియోరగఫణా ♦ ళి న్నిల్చి నర్తించి తీ

చ. నరునకుఁ గౌరవేశునకు ♦ నందయశోదలకున్ గృపామతిన్
దరణి సహస్రకాంతి గగ ♦ నంబునఁ గప్పుచు దుర్నిరీక్ష్యమై
యరయఁగ నాదియున్ గడయు ♦ నక్షుల కందని నీ మహోద్భుత
స్ఫురదురువిశ్వరూపమును ♦ జూపిన కృష్ణుఁడ వీవె శ్రీహరీ. 77

మ. అని సద్బంధులఁ జంప సంశయవిషా ♦ దాయత్తచిత్తంబు వే
తవిరుత్సాహముఁ బొందు నర్జునునిచెం ♦ తన్నిల్పి సర్వార్థసా
ధనవేదాంతనిగూఢభావపరి ♦ శుద్ధజ్ఞానదంబై తన
ర్చిన గీతామృతవృష్టి నిచ్చితివి ♦ శ్రీకృష్ణుండవై శ్రీహరీ. 78

మ. బలరామాఖ్యఁ ద్వదంశశేషుఁడు ధరా ♦ భారంబుఁ బాపంగ భూ
తలి నీకగ్రజుఁడై యమానుషబలో ♦ త్సాహాతిరేకంబు శో
భిల జన్మించి కురుక్షితీశు పురి ను ♦ ద్వేలక్రియన్ గంగలోఁ
గలుపన్ లేపిన చిహ్న నేటికిని సా ♦ క్షాత్కారమౌ శ్రీహరీ.79

ఉ. శుద్ధతమాంతరంగమున ♦ సుస్థిరసద్విధులన్ జరించినన్
బద్ధుఁడు ముక్తసంగుఁ ♦ డయి భవ్యపదంబును బొందఁగల్గు నం
చిద్ధరణీజనంబుల క ♦ హింసకృపన్ బ్రచురించి మోక్షసం
సిద్ధులఁ జేసి తెందఱినో ♦ చెచ్చెర బుద్ధశుభాకృతిన్ హరీ. 80

మ. ధరణిన్నిర్గతధర్మమై విధినిషే ♦ ధశ్రేణి తార్మారులై
పరితాపంబులు సజ్జనాళికి సుఖ ♦ ప్రాప్తంబు దుర్జాతికిన్
బరగన్ ఘోరమహాఘభారము సహిం ♦ పన్రానిదై యుండు న
త్తఱి జన్మించెదవంద్రు కల్కివయి స ♦ ద్ధర్మంబునిల్పన్ హరీ.81

మ. నరరూపంబున నొక్కయప్డు మృగజ ♦ న్మంబొంది యొక్కప్డు దుర్
బరులం దుజ్వలమానిజాంశము స్ఫురిం ♦ పన్ జేసి యొక్కప్డు దుర్
స్థిరసంకల్పముమాత్రి నొక్కొకపుడున్ ♦ ఫివ్రింబులన్మాన్పి భూ
భరమున్బాపెదు ధర్మసంస్కరణను ♦ స్వాంతుండవై శ్రీహరీ. 82,

మ. రవియందంధతమిస్రముండ నటుఁజే ♦ రఁగలేవు నిష్కర్మసం
భవబంధంబుల కామ్యకర్ముఁడవు గా ♦ వన్మ్రాతదూరుండవున్
భువనోగ్రాఘభరంబుఁ బాపుటకునై ♦ భూమిన్ భవంబొందుచుం
దువు నిర్హేతుకానుమాత్మఁ బాయునుగదా ♦ దోషావళుల్ శ్రీహరీ.

చ. నిను ఘనభక్తిఁ గొల్చుచు న ♦ నిందితవృత్తిఁ జరించు నాయెడన్
గనికర మింత సూపకయ ♦ కాలము సద్గుణరాసులైన మ
త్తనయులఁ గొంటి విస్మరణ ♦ దద్దయు దుర్భరగర్భశోకవ
హ్నిని సనుఁ గాల్చి, యేమనఁగ ♦ నేర్తు భవద్విధిఁ గూర్చి శ్రీహరీ.

శా. మున్నెన్నింటినొ కష్టరాసులను ని ♦ ర్మూలించి నీపాదభ
క్తున్నన్ గారిమిఁ బ్రోచి యిప్పుడు విప ♦ ద్ఘోరానలజ్వాలలో
న న్నిట్లేతుకఁ ద్రోసి తకటా ♦ నాయందుఁ దప్పేమి యే
మున్నన్ నిచ్చకిపై నిద్రవేయుదువె బ్ర ♦ హ్మోగ్రాస్త్రమున్ శ్రీహరీ.

శా. నాపై నీదయ తప్పెనో, యఘముల ♦ న్గావించినానంచు నీ
కోపస్వాంతముఁ జూపనెంచితొ, నినున్ ♦ గొల్వంగనేమానినా
నో, పాపస్మృతమత్పురాకృతఫలం ♦ బో యెట్టులైనన్ సరే
నీపాదాశ్రయుఁ డస్గదా యిటులఁ జ ♦ న్నే నెయ్యఁగా శ్రీహరీ. 86.

చ. చెలువఁపు నీకటాక్షమునఁ ♦ జేరు సుఖంబులటుంచుఁ గష్టముల్
కలుగుటకున్ బురాకృతము ♦ కారణమంచుఁ దలంచి మంచిచె
డ్డలయెడ నొక్కరీతినిఁ ద ♦ డంబడకే నినుఁ గొల్చుచుంటి నీ
విలసదపాంగదృష్టి ప్రభ ♦ వింప మికేమికరంబు శ్రీహరీ. 87.

మ. నినుధ్యానించుకొలంది నేలయొకొ న ♦ న్వేధించు ఘోరాపదల్
ఘనకష్టంబులఁ బెట్టి నామదిఁ బరీ ♦ క్షన్ జేసెదో యున్న నా
మనమందున్ వసియించు నీ వెఱుఁగవే ♦ మద్భక్తియుక్తిస్థితుల్
చనునే నిర్దయఁ బడ్డవానిఁ బదిరా ♦ ళ్ళన్ గొట్టఁగా శ్రీహరీ. 88.

మ. ధరణిన్ జేసిన కర్మబంధచయముల్ ♦ దప్పంగ రావంచుఁ జె
ప్పిరి మున్పండితులట్టులైన నిను ను ♦ ద్వేలాఘ గాఢాంధకా
రరవిజ్వాల యటంచుఁ బల్కెడు శ్రుతి ♦ పాళిచూణ్య మేమహా,భవ
చ్చరణధ్యానముచే మహాఘములు భ ♦ స్మంబౌఁగదా శ్రీహరీ. 89

శా. నెమ్మిన్ జూడక కన్నతల్లి శిశువున్ ♦ శిక్షించినన్ గానఁగా
రమ్మం చెవ్వరిఁ జీరఁగల్గునది, నే ♦ రన్నీయుడే తల్లి యో
యమ్మా! యమ్మ! యటంచు బిడ్డ తను డా ♦ యన్ బోవ? నాలీలనీ
వెమ్మాడ్కి స్మరసించినన్ శరణమీ ♦ వే నాకుఁ జుమ్మీ శ్రీహరీ.

మ. మృతులన్ జీవములిచ్చి తెచ్చితివి ♦ కూర్మిన్ సాధ్వీమానంబుఁగా
చితి చేలంబులొసంగి యక్షయముగాఁ ♦ జేతన్ మహాద్రిన్ ధరిం
చితి; కంబంబునఁ బుట్టితింక నమ ♦ చిత్రంబులెన్నో ఘయొన
ర్చితి మున్దీనులఁ గావ నిప్పుడెటఁ జే ♦ రెన్ బ్రేమ నీకో హరీ. 91.

మ. కరిదైత్యేంద్రసుతాంబరీషముఖ భ ♦ క్తవ్రాతసంరక్షణం
బరయంగా బహుపూర్వగాధలు కదా ♦ యార్తప్రజాపోషణా
చరణస్వాని తె యిప్పుడట్లయిన నీసద్భక్తమర్త్యాళి కె
వ్వరయాదిక్కు? భవద్యశంబెటు ధరన్ ♦ వ్యాపించెడిన్ శ్రీహరీ.

ఉ. మున్ను మహోజ్వలస్థితినిఁ ♦ బొందిన భక్తులు నీకు బంధులే
సన్నుతసత్ప్రవర్తనను ♦ జాలినవారలు వారలన్న, గ్రీ
గిన్నుల నీవు సూడక య ♦ ఘంబులఁ బాసిరె వారలైన నన్
జన్నసిసూపు చూచుటకు ♦ నే నొనరించినదేమి శ్రీహరీ. 93

మ. బలికిన్ ఒంటులసం బొనర్పఁ జనితో ♦ భక్తావళుల్ నీ మహో
జ్వలపాదద్వయి హృత్సరోజములలో ♦ బంధించిరో, పోవఁగా
వల దీవెందని లక్ష్మి తావకలస ♦ ద్వక్షస్థతి న్నిల్చెనో
యిల. గానంబడ వెందు దీనులకు ది ♦ క్కెవ్వారికన్ శ్రీహరీ.94

ఉ. దాసుల మానసంబుల మ ◆ దంబున గోచరమయ్యె దండ్రు నీ
వేసమయంబునం దయిన ◆ హృద్గతి నాతఁ గనంగరావు నీ
దాసుఁడఁ గానొ నాదు దురి ◆ తంబుననో, కృప లేదొ నీకు, నీ
దాసుల పాదభక్తిని వి ◆ ఘంబున నైనఁ దలంపవే హరీ. 95

ఉ. అమ్మయు నయ్య నీవె యని ◆ యాత్మల నమ్మి నటించు దీన లో
కమ్ముల బాధపెట్టుట య ◆ ఖండకృపానిధి వైననీకు న్యా
యమ్మె? కృతాదికాలముల ◆ నైనను గాదన నొప్పగే కలిఁ
దమ్ము, భవంబుఁ జిమ్ము, సు ◆ కరంబుగ నీకృప నిమ్ము శ్రీహరీ. 96

మ. సదయాత్ముండవు గావొకో యనఁ గృపా ◆ సారాబ్ధి వార్తాభయ
ప్రదదక్షుండవు కావొకో యన దగ ◆ ద్రక్షుండ వర్థార్థినా
సదుపాయంబులు లేవొకో యన రమా ◆ స్థానంబురం, బస్వతం
త్రదశన్ జిక్కితొ యన్న నీవ ప్రభువే ◆ తత్సర్వసంసృష్టి కీ
విధి నన్నిట్టు సుమేటివయ్యుఁ గరుణన్ ◆ వీక్షింపవేలా హరీ. 97

చ. నిను శ్రితనాళనేటికి ము ◆ నివరిజ మేపదపద్మముల్ మనం
బున ధృతిఁ జేర్చి నిత్యసుఖ ◆ ము న్గనఁగల్గెడి నేత్రి లోకపా
వనపదపద్మరేణువుల ◆ స్పర్శ యహల్య శిలాత్వ మార్చె నా
యనఘపదాంబుజంబులు మ ◆ దార్తి హరింపఁగ లేవె శ్రీహరీ. 98

శా. నీనామంబునఁ జేరియుండు నెపుడున్ ◆ దివ్యత్సుధామాధురీ
పానీయంబది గ్రోల సంసృతి విష ◆ ద్వారం బడంగున్ గదా,
యానామంబె బెట దాఁపఁగాఁగలవు మా ◆ యావత్ప్రమేయస్థితుల్
దానన్ జేకుఱ నిన్నచింత్య నిటులే ◆ లాసన్నుతింపన్ హరీ. 99

చ. ఎఱుఁగకయంటినన్ గడుద ◆ హించుఁగదా యనలంబు తత్క్రియన్
గరము మనంబు లేక యయి ◆ నన్ భవదుజ్జ్వలదివ్యనామసం
స్మరణ మొనర్చినన్ గలుష ◆ మండలి పాయుఁ ద్వదాఖ్యలోనియ
క్షరములయందె సాపత్పుణ ◆ సంరతుయవహ్ని వెలుంగు శ్రీహరీ. 100

3

ఉ. కార్మికబోధలన్ సయిపఁగా ♦ ధృతిసాలక తండ్రివైన నీ
నిర్మలధార్మికత్వముఁ గ ♦ ణించి నినున్ బహునిష్ఠురోక్తులన్
మర్మము లంటనాడిన ప్ర ♦ మాదము సైపఁగదయ్య చిత్తమున్
గూర్మినిఁ జూడుమయ్య నిను ♦ గొల్చెడు దానుఁడనయ్య శ్రీహరీ.

శా. మోక్షస్థాన మసంగఁ దావకప ♦ దాంభోజాతియుగ్మంబె, త
న్నిత్యానుభవైకసాధన మనన్ ♦ నీభక్తియే త్వత్కటా
క్షాక్షీణపరిధ కల్గకున్న నగునే ♦ యాసాధనప్రాప్తి శ్రీ
వత్సా! నామది నాటవే తిరముగా ♦ త్వత్పాదభక్తిన్ హరీ. 102

చ. దేనిఁ భజించు సేసినను ♦ దేనిని విన్నను దేనిఁ గాంచినన్
దేని మది న్దలంచినను ♦ దేనిఁ జేసిన నీవె మూల మ ను
ద్దాంతి కటంచుఁ దోఁచు మదిఁ ♦ దెచ్చి విమర్శ నొసర్ప, నాస్మృతి
జ్ఞానము నిల్పవే సతము ♦ శల్యగతంబు యుండ శ్రీహరీ 103

ఉ. ఇంచుకయు న్వివేక ముడ ♦ యింపక పుత్త్రసతీధనాలయో
దంచితసంసృతిన్ దిర మ ♦ టంచుఁ దలంచి దురంతపాప మా
ర్జించితి నింతదాకఁ దెలి ♦ సెన్నిజ మిప్పుడు, నారకాంబుధిన్
ముంచక కావవే యఘవి ♦ మోచనదక్షకటాక్ష శ్రీహరీ. 104

మ. తనువందున్ బులకల్ జనింప, నయనద్వం ♦ ద్వంబులన్ హర్షబా
ష్పనికాయంబులు గ్రమ్మ, గద్గదిక ♦ సంప్రాప్తింప, నిశ్చంచలా
త్మ ననంతు న్బరమాత్ము నిన్ను దృఢిమా ♦ త్రంబైనఁ జింతింపనో
ప్పనదే పుణ్యదినంబు తక్కినదినంబుల్ ♦ వ్యర్థముల్ శ్రీహరీ. 105

మ. తనయద్వంద్వ మకాలమృత్యుఘనప ♦ క్త్రిజ్వాలల గ్రన్నగ్గఁ ద
ఘ్నదుఃఖాంబుధిఁ జాకతావకపద ♦ ద్వంద్వైకచింతన్ విమో
హానివృత్తి న్గని సద్గతిన్ బడయఁగా ♦ హర్షించుచున్నాఁడ నో
యనఘా! నే శరణార్థిఁ జూపఁగదె నీ ♦ యంఘ్రిద్వయిన్ శ్రీహరీ,

శా. చూడఁజూడఁగ సంసృతిం గలవటం ♦ చుం దోఁచు సౌఖ్యస్థితుల్
వీడ ల్గాఁగనవచ్చుఁగాని సుఖమే ♦ వేళన్గననౌదు నీ
జాడల్దెల్పు జగద్విలాసముల ని ♦ చ్ఛన్గాంచుచుం గాంతులన్
వీడన్గల్గి నిన్ భజించిమనుటం ♦ టెం సౌఖ్యమున్నే హరీ. 113.

మ. నిమిసంబైన మనంగఁజాలుదుమె క్షో ♦ ణిన్నీదుహస్తావలం
బము లేకున్నఁ బరీక్షనసంకలితముల్ ♦ మాజీవనంబుల్ మహా
ల్పము మా పరిజ్ఞ, భవద్వంశంబున సదా ♦ వర్తింతుమే కాని నే
రము మా యంతమనంగ నెట్లుగడ తేర్పం జూచితో శ్రీహరీ. 114

మ. దయచే నీవు సృజించియుంచిన పదా ♦ ర్థవారితముల దెచ్చి యెం
తయుఁ గట్టం దొంగుటం దినంగగు ♦ ప్రయత్నంబులను జేసికాని నే
నయయో నీపదభక్తి నర్చముగఁ ♦ జేయఁజాలకున్నాఁడ దు
ర్నయతాపత్రయముల్ హరించి కరుణం ♦ గాపాడవే శ్రీహరీ.

చ. తెలియక నేయుపాపముల తీఱువచింపఁదరంబుగాదు నే
తెలిసియొనర్చినట్టివె యతిపరిబలంబులుగాన సంఖ్యలై
తలపున భీకరాహరంవిధంబున నాల్కలుసాపుచుండు నో
కలుషవిహంత నీశరణుకన్న మఱేగతిలేదు శ్రీహరీ. 116.

మ. జలదవ్రాతము మింటనల్దెసల నా ♦ చ్ఛాదించిమార్తాండు ను
జ్జ్వలకాంతిం బరిసరింపనీక ధరణిం ♦ బల్చీకటిన్నుంచున
ట్టుల నీమాయవిమోహపాశములఁజు ♦ ట్టుం మానసంబుం విని
ర్మలవిజ్ఞానముఁదోఁప నీదుపరికృతిం మల్పంగదే శ్రీహరీ. 117.

చ. నిరతము నీదుసద్భజన ♦ నిశ్చలచిత్తముతోడఁజేసి దు
స్తరభవనీరధిన్గడచి సద్గతినొందఁగవచ్చునన్న, భీ
కరవిషమావరోధకము ♦ కాదె యవారితకుక్షిబాధ త
ద్భరమువారించు నే బహువిధంబులఁ ద్రిమ్మఱకుండ శ్రీహరీ. 118

మ. తనుజీవేంద్రియమానసంబులు యథా ♦ ర్థంబెన్న వేర్వేరులై
నను క్షీరాంబువులట్టు లైక్యమగుచున్ గాయంబె తానంచు నె
మ్మనమున్; మానసతంత్రమందునుగులున్ మాయావిమోహస్థితిన్
మనుఁ దన్మోహతమంబుఁ బాపఁగదె వి ♦ జ్ఞానప్రభన్ శ్రీహరీ. 119

ఉ. ఎన్నఁడు సూపెదో కరుణ ♦ యెన్నఁడు మానసశుద్ధిఁ జేసెదో
యెన్నఁడు చింతలార్పెదవొ ♦ యెన్నఁడు నిర్మలసౌఖ్యమిచ్చెదో
సన్నిహితంబు గొందె మృతి ♦ జాగొనరించుట చన్నె చిత్తము
పన్నుఁడు వచ్చుదాశ ధర ♦ వర్ధిలు నేనిరుపేద శ్రీహరీ. 120

ఉ. దాసుని తప్పులన్నియును ♦ దండముతో సరియన్నయట్లు నే
జేసిన పాపరాసుల న ♦ శేషము మన్ననసేయుమంచు నీ
భాసురసత్పదాబ్జముల ♦ భావమునన్ దగ మ్రొక్కుచుంటి దే
వా! సదసద్వివేకగుణ ♦ సత్తనఁ జూపఁగ నేర్తునే హరీ. 121

ఉ. నేరము లెన్నుచో నిలువ ♦ నేరఁ జుమీ క్షణమైన నీదరిన్
బారము లేదు నాకలుష ♦ వార్ధికి నీకరుణామృతాబ్ధికిన్
ఘోరతరాఘవారములఁ ♦ గూల్పఁ సమర్థులు నీవుతక్క ను
న్నారె యుపేక్షయోర్వఁగలనా పరమార్తజనావనా హరీ. 122.

ఉ. ఆకలిదప్పులన్ సయిచి ♦ యాత్మఁ దిరంబుగ నిల్ప నేర, మైఁ
దాఁకెడు శీతలోష్ణపరి ♦ తాపములో లోపఁగ నేరఁ జిత్తమున్
సోఁకెడు నప్రియంబులకు ♦ నుబ్బక నిల్వఁగనేర, యిట్టిన
న్నేకరణిన్ గృపాజలధి ♦ యేలెదొ పాపముడంచి శ్రీహరీ. 123.

మ. తనువే తానని దేహసౌఖ్యమునె ప్రా ♦ ధాన్యంబుగాఁ జూచుచున్
మనమందున్ క్షణమాత్రమైన నినుసం ♦ భావింపఁగాలేని దు
ష్టనరుం డెంతయు సంపదల్వడయు నీ సద్భక్తుఁ డాపన్నుఁడై
ననఘత్వంబునకా శాపదాగను మన ♦ శ్శాపిప్తమా శ్రీహరీ.

ఉ. అన్నిటికిన్ బ్రధానము హ్రి ♦ దంచితనిశ్చలభావమేకదా
యెన్నియొనర్చిన న్నిలువదీమది నీపదపద్మయుగ్మమం
దున్నిమిషార్థమైనఁ, బలుతోఁ ద్రివలంబౌజును మర్కటంబటుల్
క్రిన్ననదీని నీవదయ ♦ గంబుల నిల్పఁగదే ప్రపన్న హరీ. 125.

ఉ. దీనులపాలివాఁడవని ♦ తెల్లము గావిని ఘోరపాపసం
తానము లెన్నియున్నను మనఃస్థితి యెంతవికారసంగతం
బై నిరుఁజెందకున్నను మ ♦ హాత్ముఁడ నేటను నీకటాక్షముల్
గానఁగఁగల్గు నాకనుచు ♦ నమ్మితి నమ్మొనరింపకే హరీ. 126

ఉ. పాపివజామిళున్ బరమ ♦ పావనుఁజేసితి కాకదైత్యుడు
ర్వ్యాపకముల్ క్షమించితివి ♦ హస్తినుతోఁ నుడతన్ స్పృశించితో
శ్రీపతి! నీదుచిత్తముస్ఫురించిన నెట్టియఘాత్ముఁడైన డు
ష్ప్రాపముల్ హరించి నిమిషంబునఁ జేతువు నీవు శ్రీహరీ. 127

మ. జనకుండా, జననుల్ స్త్రియా, తనయులా, ♦ సద్బంధులా, సహామా
ధనమా, క్షేత్రములా, యిహానుభవమో ♦ దన్నాకు, నిందందునీ
యనఘావ్యక్తపదపద్మయుగ్మము లెది ♦ క్కన్యంబుశూన్యంబు నై
మ్మనమం దేమఁజింబోకుమయ్య పరమా ♦ త్మా నాస్థితిన్ శ్రీహరీ.

మ. పొరపాటొందినచిందినాడ ధరణిన్ ♦ బుత్రాదిసద్బంధు లెం
దఱు వర్ధిల్లుచునున్న సౌఖ్య మొకన ♦ న్నాగల్గునే నీకృపా
దరణం బించుక లేకయుండిన మహా ♦ త్మా! కాన నాకీవ సు
స్థిరసౌఖ్యప్రద మేదొ యారసి ప్రసా ♦ దింపంగదే శ్రీహరీ. 129

చ. పలుమఱుఁ గావుకావు మని ♦ పల్కినమాత్ర పరిగ్రహింతు నే
ఖలుఁ డితఁడంచుఁ ద్రోసివిడఁ ♦ గాఁ దలపోయకుమయ్య నేమహా
ఖలుఁడనైన నీపదయుగం ♦ బొకసారి స్మరించినంత దో
షలతిక లూడునన్నఁ బలు ♦ సార్లు నుతించితిఁ గాయవే హరీ. 130

ఉ. ఎవ్వరు నామొఱల్ వినెద ♦ రెవ్వరితోడ వచింప నేమి యా
నెవ్వరు గోడు లార్పఁగల ♦ రీశ్వర యొక్కఁడ వీవు దక్క నా
నెవ్వగ లెల్ల మద్ధృదయాసీ ♦ రజవాసివి నీ వెఱుంగవే
యెవ్వరివాఁడనయ్య తగ ♦ నే యిటు లూరక యుంట శ్రీహరీ. 131

ఉ. తల్లియుఁ, దండ్రియున్, గురువు ♦ దైవము, భ్రాతయు, నేతయున్, ధరా
వల్లభుఁ డర్థసంపదలు ♦ వస్తుచయం బిహమున్ బరంబు శ్రీ
వల్లభ! నీవనుమ్మి నన ♦ వారము నమ్ముఁగ లేదు నీకు నా
యుల్లి మొఱంగినాడ నెటు ♦ లోర్చి భరించెదో నన్ను శ్రీహరీ.

ఉ. అంతమునందు నీస్మరణ ♦ మబ్బునొ యబ్బదొ రోగబాధచే
స్వాంతము విస్మృతిన్ గనునొ ♦ వాతకఫాదులు కంఠ మడ్డునో
యొంతవివిగ్రహించిన దు ♦ రిచ్ఛలఁ బాయునొ మానసంబు, నీ
చింతన మిప్పుడే పిపా ♦ సేయఁ గొనంగనుఁ జూపవే హరీ. 133

శా. తాపచ్ఛాంతియు, రాత్రక్షణము, భ ♦ క్తాభీష్టసంసిద్ధియున్
నీపాదార్చకులం దొసర్చి యశమున్ ♦ డిగ్వైభుల స్వర్వఁగా
స్థాపింపంగదె. నిన్ను నమ్మి తనయా ♦ త్రిలిల్ సేయు నాబోంట్లకున్
జూపంపంగదె నీయ కారుణ్యప్రపా ♦ శుంభత్ప్రభక శ్రీహరీ. 134

శా. నీవే యుందువు నాదు దిక్కవి మది ♦ న్నే నమ్మినాడన్ జుమీ
కావన్ రంపెడి యన్యులన్ దగునుతుల్ ♦ గావింపఁబోనన్ జుమీ
భావాతీతుఁడ నైన నీ స్మరణ న ♦ ల్పమ్మాని యుండన్ జుమీ.
నీ నెట్లుల్ ననుఁ జేసినన్ నరియె ని ♦ న్వీడన్ జుమీ శ్రీహరీ. 135

శా. ఘోరాపత్తుల మాన్పి దీనలను జే ♦ కొం దీనటంచున్ దృఢం
బారన్ దెల్పెడు భక్తలోకసుచరి ♦ త్రాసికమ్ముల్ నమ్మి న
త్కారుణ్యాంబుధ వైననిన్ను శరణం ♦ దన్ వచ్చితిన్ దూమునీ
తారామాఖ్యుఁడఁ జూపవే. యభయమా ♦ స్త్రంబున్ గృపన్ శ్రీహరీ

మ. వరుసన్ నూరును ముప్పదేడు విలస । త్పద్యప్రసూనంబులన్
తరసద్భక్తిగుణానుగుణ్యములుగా । దామంబుఁ గావించి హృ
త్సరసీజంబును నాయకాంచితలతాం । తంబట్లు బంధించి నీ
యురుతన్ దాల్పఁగ నిచ్చినాఁడఁ గొనుమ । య్యా సత్కృపన్ శ్రీహరీ.

శ్రీ హ రి స మ ర్ప ణ మ స్తు.

శ్రీ చింతామణీముద్రాక్షరశాల:— రాజమండ్రి.

# వేదాంత గ్రంథములు.

| | | |
|---|---|---|
| స్త్రీసహవాసం | 0 | 10 |
| సంగీత సైంధవార్జునీయం ౫॥ శీ | 0 | 3 |
| సంగీతపాశుపతార్జునీయం" | 0 | 8 |
| సీతాకళ్యాణం | 0 | 3 |
| గాంధీవిజయధ్వజం (శ్రీ॥ శ్రీ) | 1 | 0 |
| తిలకమహారాజు నాటకం ,, | 1 | 0 |
| చారుమతీనందివర్ధనీయం | 1 | 10 |
| వాసవదత్త పరిణయము | 0 | 8 |
| చారుమతీపరిణయము | 0 | 12 |
| ఆంధ్రనాటకకృతులు మొదటిభాగం | 0 | 10 |
| బ్రహ్మజ్ఞానానందము | 2 | 0 |
| ఇంద్రియప్రపంచసృష్టిక్రమం | 2 | 0 |
| అఖండజ్ఞానము | 2 | 0 |
| ప్రపంచలయము | 2 | 0 |
| తత్వజ్ఞానవృత్తి | 2 | 0 |
| భగవంతుని ప్రభావము | 2 | 0 |
| జనులగుణములు | 2 | 0 |
| స్త్రీలు చేయుచర్యలు | 2 | 0 |
| ముక్తిమార్గము | 2 | 0 |
| గృహస్థధర్మమార్గము | 2 | 0 |
| యింకను అనేకవిషయములుగలవు చదివితీరవలయును | | |
| తిలక్ భగవద్గీత | 3 | 8 |
| భగవద్గీత పద్యములు | 1 | 0 |
| భగవద్గీత వచనము | 0 | 6 |
| భగవద్గీత (మూలం) | 0 | 6 |
| అద్వైతసుధానిధి, ఆంధ్రటీకాసహితము 1-3 భాగములు సాంఖ్యతారకములుగలవు | 1 | 12 |
| అద్వైతసుధానిధి 3 వ భాగము ఇందు శివస్వబోధ ...ము షట్చక్రనిరూపణమును గలవు. | 1 | 0 |
| అద్వైతసుధాని 4 వ భాగం అమనస్కమార్గము గలదు | 1 | 0 |
| అద్వైతసుధానిధి 5 వ భాగము ఇందు అవధూతగీత స. టీక. | 0 | 10 |
| పరిపూర్ణ బోధ సిద్ధాంత శిరోమణి యను శివరామ దీక్షితీయము | 1 | 0 |
| సుజ్ఞానదీపము | 0 | 12 |
| శ్రీయోగవాశిష్టసారము | 0 | 8 |
| శ్రీసీతారామ ఆంజనేయ సంవాదము టీకా తాత్పర్యం ఇంగ్లీషు | 8 | 4 |
| డిటో తాత్పర్యం (అచ్చులో) | | |
| సనాత్సుజాత సంవాదము ఇంగ్లీషు | 1 | 0 |
| శంకర గీతాభాష్యం | 1 | 0 |
| రామానుజ గీతాభాష్యం | 1 | 0 |
| శంకరవిజయము సవ్యాఖ్యానము | 2 | 0 |
| వేదభాష్యం మొదటి అష్టం | 8 | 0 |
| అరుణభాష్యం | 2 | 0 |
| వేదాంత పరిభాష | 1 | 4 |
| శివగీత సాంద్ర తాత్పర్యం | 0 | 6 |
| బ్రహ్మగీత తాత్పర్యం | 1 | 6 |
| ఉత్తరగీత సటీక | 0 | 10 |
| రామగీత సటీక | 0 | 8 |
| హరిమీడేస్తోత్రము సటీక | 0 | 4 |

# ఆంధ్ర నాటకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| చిత్రనళీయము ధ. కృ | 1 | 6 | సారంగధర | 0 | 8 |
| విషాదసారంగధర | 1 | 6 | సంగీతజయంతీజయపాలం | 0 | 8 |
| పాంచాలీస్వయంవరము | 1 | 2 | ఉషాపరిణయము | 0 | 8 |
| మోహినీరుక్మాంగధ | 1 | 2 | సాప్తినాపుత్రము | 0 | 8 |
| ప్రమీలార్జునీయము | 1 | 2 | ద్రౌపదీ పరిణయము | 0 | 12 |
| చంద్రహాస | 1 | 2 | విజయబొబ్బిలి | 0 | 12 |
| బృహన్నల | 1 | 2 | శ్రీకృష్ణతులాభారము | 0 | 12 |
| ముక్తావళి | 1 | 2 | సంగీత కనకతార | 0 | 10 |
| వరూధిని | 1 | 2 | వైదర్భీవిలాసము | 0 | 10 |
| చిరకారి | 1 | 2 | సామ్రాజ్యోదయం | 0 | 10 |
| గయోపాఖ్యానము చి॥ల | 0 | 8 | ఆంధ్రపతాకము | 0 | 12 |
| ప్రసన్నయాదవము | 0 | 8 | పాదుకాపట్టాభిషేకం పాటలు | 0 | 12 |
| పారిజాతాపహరణము | 0 | 8 | లంకాదహనము పాటలు | 0 | 10 |
| చతురచంద్రహాస | 0 | 6 | చతురచంద్రహాస | 0 | 8 |
| స్వప్నవాసవదత్త | 0 | 8 | గులేబకావళి ఆ॥ సు॥ | 1 | 0 |
| పార్వతీపరిణయం | 0 | 6 | ఊర్వశీశాపవిమోచనము | 1 | 0 |
| సంగీత సత్యవిజయమను హరిశ్చంద్ర చ॥ మా॥ | 1 | 0 | జయచంద్రచంద్రరేఖావిజయమను లాల్ గోపాల | 0 | 10 |
| సంగీతసావిత్రి చ॥ మా॥ | 1 | 0 | ప్రతిజ్ఞాపాండవము | 0 | 10 |
| సంగీత ప్రహ్లాద | 0 | 12 | శ్రీకృష్ణవిలాసము | 0 | 10 |
| మహారాష్ట్రవిజయం | 0 | 12 | విచిత్ర బిల్హణీయం వు॥ అ॥ | 0 | 8 |
| చంద్రకాంత పాటలు | 0 | 10 | మణిమాల | 0 | 12 |
| సంగీత శశిరేఖ | 0 | 8 | రసపుత్రవిజయం ఇ॥ రా॥ | 1 | 0 |
| రంగారాయ కథనమను వాకారము బొబ్బిలియుద్ధము కా॥ పా॥ | 1 | 0 | చింతామణి కా॥ నా॥ | 1 | 2 |
| | | | పద్మవ్యూహము | 1 | 0 |
| | | | శ్రీరామవిజయం కో॥ వా॥ | 0 | 10 |
| కన్యకాపరమేశ్వరి | 1 | 0 | శాకుంతల కం॥ వీ॥ | 0 | 12 |
| సుగుణమణి న॥ బా॥ | 0 | 10 | సత్యహరిశ్చంద్ర | 0 | 8 |
| శ్రీరామజననము దో॥ సీ॥ | 0 | 8 | ప్రబోధచంద్రోదయం | 0 | 8 |
| శ్రీరామప్రవాసము | 0 | 8 | రత్నావళి | 0 | 8 |
| శ్రీరామవుద్యోగము | 0 | 8 | దక్షిణగోగ్రహణం | 0 | 8 |
| శ్రీరామవిజయము | 0 | 8 | మాళవికాగ్నిమిత్రం | 0 | 8 |
| శ్రీరామఅశ్వమేధము | 0 | 8 | చమత్కారరత్నావళి | 0 | 4 |
| పాండవఅజ్ఞాతవాసం | 0 | 8 | సుశీల వి॥ సు॥ | 0 | 12 |